జాతకచక్ర పరిశీలన

ఒక వ్యక్తిపైన పలురకాల ప్రభావాలు ఉంటాయి. జాతక ప్రభావం వాస్తు ప్రభావం, వ్యక్తి ఈ జన్మలో చేసిన పాప పుణ్యముల ప్రభావం, ఇతన్ని గురించి ఇతరులు ఆలోచించే ప్రభావం, దేశాకాలమాన పరిస్థితుల ప్రభావం మొదలగు అంశాలను పరిశీలించాలి.

జ్యోతిషానుభవసారంలో బెంగుళూరుకి చెందిన శివశంకర సిద్ధాంతి గారు గురువుకి సంబంధించిన ఒక యోగాన్ని చెప్పి ఈ యోగం కలవారు భారతీయులైతే 12 వ ఏట విదేశీయులైతే 24 వ ఏట వివాహం అవుతుందని పేర్కొన్నారు. ఆనాటి పరిస్థితులను అనుసరించి బాల్య వివాహాలు ఉన్న దృష్ట్యా ఆ యోగం ఫలాన్ని ఇచ్చింది. ఇదే యోగాన్ని వర్తమానకాలంలో వర్తింపజేస్తే భారతీయులకు 24 వ ఏట, విదేశీయులకు 36 వ ఏట వర్తింపజేయాల్సి వస్తుంది. కాబట్టి జాతక పరిశీలన చేసేటప్పుడు జాతకుడు పెరిగిన పరిసరాల పరిస్థితులను కూడా పరిశీలించి ఫలాన్ని తెలియజేయాలి. దీనినే బృహత్సంహితలో వరాహమిహరుడు దైవజ్ఞ లక్షణాలను చెబుతూ “లోకజ్ఞ:” అని పేర్కొన్నాడు. దేశాకాలమాన పరిస్థితులను అవగాహన చేసుకోవాలంటే లోకజ్ఞత ఆవశ్యకం అన్నారు.

బి.వి. రామన్ గారు రచించిన “ప్రశ్న మార్గం”లో ఈ జన్మలో చేసిన పుణ్యపాపముల యొక్క ప్రభావాలు పరిశీలించవలసిన అవసరాన్ని గురించి ఒక వివరణ ఇచ్చారు. జాతకం పూర్వజన్మ కర్మఫలాలను నిర్ధేశించినదైతే, ప్రశ్న ఈ క్షణం వరకు మనం చేసిన పుణ్యపాపాలను కూడా పరిశీలనకు తీసుకొని ఫలిత నిర్ధేశం చేస్తుందంటారు.జాతకం అనుకూలంగా ఉండి ప్రశ్న వ్యతిరేకంగా వస్తే ఈ జన్మలో పాపాలు ఎక్కువగా చేశాడని గుర్తించమన్నారు. జాతకం వ్యతిరేకంగా ఉండి ప్రశ్న అనుకూలంగా వస్తే ఈ జన్మలో పుణ్యాలు ఎక్కువ చేసినట్లు గుర్తించమన్నాడు. రెండు సమానంగా వస్తే పుణ్యపాపాలు సమానంగా చేసినట్లు గుర్తించమన్నాడు. దీనిని బట్టి జాతంకం పరీక్షించే ప్రతి సంధర్భంలోను ప్రతి అంశానికి ప్రత్యేకంగా ప్రశ్నను కూడా పరీక్షించి చూడవలసిన ఆవశ్యకత జ్యోతిష్యునకు ఉంటుందని అర్ధమవుతుంది.

మన పరిసరాలలో ఉండే ప్రజలు మనయందు కొన్ని సంధర్భాలలో అనుకూల భావాన్ని, వ్యతిరేకభావాన్ని పొందుతూ ఉంటారు. ఆ పొందిన భావాల ప్రభావం మన మీద పడుతూ ఉంటుంది. ఈ భావనలలో సానుకూలత సాధించటానికి భారతం ఒక విధానాన్ని చెపుతుంది. “ధర్మాయ యశసే అర్ధాయ భోగాయ స్వజనాయచ! పంచాధా విభజన్విత్తం ఇహ ముత్రచ మోదతే” మన ఆదాయంలో 20 శాతం ధార్మిక కార్యక్రమాలకు, 20 శాతం కీర్తిని పెంచే కార్యక్రమాలకు, 20 శాతం భవిష్యత్తులోని ఆర్ధిక అవసరాలకు, 20 శాతం బంధువర్గంతో అనుభవించటానికి, 20 శాతం తనవారిని అర్హులను ఆదుకొని వృత్తి కల్పనా చేయటానికి వినియోగిస్తే ఇహపర సౌఖ్యాలు లభిస్తాయి.

ఇతరుల నుండి వచ్చే భావనల ప్రభావాన్ని గూర్చి మనస్తత్వ శాస్త్రారం కూడా సమర్ధిస్తుంది. ఉదా:- మన పిల్లలు బాగా చదవట్లేదు అని మన ఇంటికి వచ్చిన వారి ముందు అన్టే వారందరి భావనల ప్రభావంతో ఆ బాలుడు అలాగే స్థిరపడతాడు. అందువల్ల ఇతరుల భావనల ప్రభావాలు మనపై చెడు ప్రభావం చూపించకుండా ఉండటానికి నియమాలు పాటించాలి. కాబట్టి జాతకామో, వాస్తో ఒకదాన్ని చూసి తక్కిన ప్రభావాలను గమనించకుండా ఫల నిర్ధేశం చేస్తే అది తప్పిపోయే ప్రమాదమే ఎక్కువ. కాబట్టి ప్రతి జ్యోతిష్యుడు జాతక సహకారంతో పాటు, వాస్తు శాస్త్రాన్ని కూడా అధ్యయనం చేసి ఆ రెండిటినీ పరిశీలన చేసి పరిశీలన చేయటానికి అవకాశం లేని తక్కిన అంశాలను తపశ్శక్తి గమనించే శక్తిని సంపాదించి ప్రశ్న శాస్త్రం ద్వారా దాన్ని నిర్ధారించుకొని ఆ తరువాత ఫలితాన్ని చెప్పేటట్లయితే ఎక్కువ శాతం వాస్తవానికి దగ్గరగా, జనులకు ఉపయుక్తమయ్యేలా సలహాలను అందించగలుగుతాడు.

ప్రతి జ్యోతిష్యుడు తానిచ్చే సలహా వలన ఎదుటి వ్యక్తి మనపై ఉన్న విశ్వాసంతో శ్రమ, కాలం, ధనం మొదలైన వాటి నెన్నింటినో వెచ్చిస్తాడు కావున జ్యోతిష్య సలహా చెప్పే ముందు జాతక పరిశీలన చేయటం మన బాధ్యత.